భారత గ్రంథమాల
కవి పరిచయం—1



# భగవద్గీతామృతసారము



రచయిత

మధురకవి

శ్రీ కాకాని నరసింహారావు



ప్రకాశకుడు

చతుర్వేదుల పార్ధసారధి

గుంటూరు 1

చందా రెలు రు 1-00] [విడిప్రతి రు 1-50 పై

# ఉ పో ద్ఘా త ము

—ω—

శ్రీమద్భగవద్గిత ఆర్ష మతబోధాత్మక గ్రంథములలో ఉత్తమోత్త మము అదియొక పెన్నిధి ఒక మహాద్భుత రత్నాకరము అందలి రత్న ము౦ విలువ ఊహాతీతము ఈ లోకోత్తర గ్రంధము విశ్వసాహిత్యమున నిరుపమాన కాంతితో నిత్యశోభాయమానమై వెలుగొందుచున్నది ఇందలి సందేశము అనంతము నిత్యసత్యము మానవాళికి తరణోపాయముగీత గీత వినా మానవులకు ఉత్తముడు గురువు మార్గదర్శిలేదు ప్రపంచసాహిత్యములో గీతతో తుల తూగగల గ్రంధములేదు ముందు కలుగదు నభూతోనభవిష్యతి జ్ఞానసముపార్జనకు మానవులు నిత్యము పారాయణ చేయదగిన గ్రంధము గిత గిత చదువనివాడు చదివి విజ్ఞానమందనివాడు దురదృష్టవంతుడు గీత జ్ఞానజ్యోతి మానవుని దివ్యమొనర్చును మరణభీతిని మాన్పును విశ్వ సాహిత్యమందల ఉత్తమోత్తమ వేదాంత గ్రంథరాజము గీత సకల శాస్త్ర ముల వేదాంతముల సారాంశము గీత

ప్రపంచములోని మహాత్ములందరు ఏకకంఠముతో గిత లోకోత్తర గ్రంధమని ప్రస్తుతించిరి గిత నెరుగనివారు మానవులు కాదనిరి స్వామి వివేకానందుడు ఆర్యులు పాశ్చాత్యదేశముల కొసగిన సందేశము "గీత అని చాటెను గీత ఉత్కృష్టతను గీతలోని పరమార్థమును సర్వులు శిరసా వహించినారు త్రిమతాచార్యులేగాక ఎందరో విజ్ఞానధనులు విద్యావిశార దుల మహాత్ములు లో మాన్యులు విదుషీమణులు ఆంగ్లభాషా పారంగ

తులు గీతకు భాష్యములు వ్రాసినారు గీత అనువదించినారు వ్యాఖ్యానించినారు

ఆ ఉద్గ్రంథములన్నియు నిత్యము పారాయణము చేయుట క్షేమావహము అభిలషణీయము కాని అందరకు సాధ్యముగాదు అవకాశములేదు కావున గీతామృత సారము సంగ్రహముగా తెలిపిన భగవద్గీత గొప్పదనము మహామహులు సోదరాంధ్రులు తెల్సి గీతాపరమందు ఆసక్తి కల్పించుట నా ధర్మమని భావించి నా అసమర్థతను అశక్తతను గణింపక ఇట్టి గీతామృతసారమును మాతృభాషలో తెలుప సాహసించితిని సోదరాంధ్రుల ఆదరణకియ్యది పాత్రమగునని విశ్వసించుచున్నాను ఇందలి దోషగుణములను విజ్ఞులు తెలిపిన కృతజ్ఞతతో సవరించుకొందును



# భగవద్గీతా ప్రాశస్త్యము



ఉ. వేదమునందు కలదిది విశ్వమునందున లేదు వేదమే
పాదు సమస్త విద్యలకు స్వామి స్వయమ్ముగ వేదసారమా
మోహమునన్ వచించె నరుమోహము శోకము తీర్ప వ్యాసుడే
స్వాదుమరందశైలి సరసమ్ముగ పాడెను వేల్పు పాటగా

వేదములు అనంతములు వేదములో లేనిది ప్రపంచములో లేదు వేదమే సమస్త విద్యలకు పాదు భారతము పంచమ వేదము ఆ మహా భారత కల్పవృక్షమున పూసిన పారిజాత పుష్పము గీత శోక మోహములకు వశుడై ధర్మము మరచి కర్తవ్యమును విస్మరించిన తన భక్తుని మిత్రుని అర్జునుని నిమిత్తమాత్రముగ నిల్పి పరమాత్ముడైన శ్రీకృష్ణ పరబ్రహ్మము గీతద్వారా లోకమునకు ధర్మోపదేశ మొనర్చెను వ్యాసుడు గ్రంథస్థము చేసెను వేదములు ప్రభుసమ్మితములు పురాణములు మిత్ర సమ్మితములు కావ్యములు కాంతాసమ్మితములు అని గ్రంథములను మూడు తరగతులుగా విభజించినారు ఆర్యులు అనగా వేదములు రాజాజ్ఞలవలె అధికారయుతముగా ధర్మమార్గములను శాసించును పురాణములు మిత్రులవలె సలహా లొసంగును కావ్యములు కాంతల సరసాలాపవిలాసములవలె హాయి నొసంగునని నుడివిరి

మానవుడు శరీరము మనస్సు ఆత్మల కలయిక కావున ఆనందము కూడ మూడు విధములు శారీరక ఆనందము మానసిక ఆనందము ఆత్మానందము శారీరక ఆనందము క్షణికము మానసిక ఆనందము తాత్కాలికము ఆత్మానందము శాశ్వతము పుస్తకములలో కొన్ని శ్రవణపేయములై శరీరమునకు సంతోషము కల్గించును కొన్ని మానసానందము చేకూర్చును కొన్నిమాత్రము పరితోషమైన ఆత్మానందము చేకూర్చును అందువలననే ఒకే ఒక పర్యాయము కిల్లే మూల పారవేయవలసిన పుస్తకములు శ్రీరామ మొదలు ఉత్తరించవలెను వరకు అనగా ఆమూలాగ్రముగా చదువదగిన పుస్తకములు నిత్యము భక్తి శ్రద్ధలతో పారాయణ చేయదగిన గ్రంథములు అని మూడు రకముల పుస్తకములు కలవు

విషవృక్షమైన సంసారవృక్షమునకు అమృతోపమానమైన ఫలములు రెండే రెండు కలవు ఆ ఫలయుగ్మమే సజ్జన సహవాసము సత్కావ్య పఠనము ఈ కాలమున సజ్జన సహవాసము లభించుట దుర్లభము సత్కావ్యము లభించుట కష్టము కాదు పుస్తకమును మించిన మిత్రుడు పుడమిలో లేడు ఏది సత్కావ్యమో యోచింతము వస్తువైభవము వచో వైభవము వస్తువైభవములు గల కావ్యము ఉత్తమమైనది అనగా గ్రంథకర్త ఎన్నసముర్థుడై యుండవలెను ఆయన వచోవైభవమునుకూడ కలిగియుండవలెను వస్తువు కూడ శాశ్వతమైనదై యుండవలెను ఈ మూడు వైభవములు ఎద్దించినపుడే సర్వజన శిరోధార్యమైన గ్రంథ మవతరించును

కవులు నాలుగు రకములు కవి సత్కవి మహాకవి ఋషి కవి వయస్సుతో రచన మొనర్చును సత్కవి ప్రతిభతో సృష్టించును మహాకవి బుద్ధితో బృహత్ కావ్యమును నిర్మించును ఋషి ఆత్మతో ఉత్త మోత్తమ కావ్యమును సృష్టించును అందుచేతనే ఋషికానివాడు కవికా డని కావ్యము రచింపజాలడు అనిరి

వేదములు రెండు భాగములు కర్మకాండ జ్ఞానకాండ ఉపనిష త్తులు జ్ఞానకాండ వానినే వేదాంతము లనియు వేదశిఖరము లనియు శ్రుతిశిరస్సు లనియు పలుకుదురు ఆ ఉపనిషత్తులను గోవులనుగాజేసి అర్జునుని లేగదూడగా నిలిపి శ్రీకృష్ణుడు తానొక గోపాలుడై గీత అను అమృతమును పితికి మనకు అందించినాడు మీరు భోక్తలు కండని ఆహ్వానించుచున్నాడు ఏమి మన అదృష్టము తడవేటికి ఆహ్వానింతము రండి శ్రీహరిపాదపద్మమున జన్మించిన గంగలో స్నానమాడినంతనే పుణ్యము కల్గునని ఎంతో శ్రమకోర్చి కాశికి వని గంగలో స్నానముచేయు చుందురుకదా యోగీశ్వరేశ్వరుడు పరమేశ్వరుడైన శ్రీకృష్ణపరమాత్మ ముఖ కమలమునుండి స్రవించిన మకరందధారయైన గీతామృతపానమున లభించు పుణ్యము చెప్పనలవియనా సమస్త పాపచయమును దగ్ధముచేసి నిత్య నిరతిశయమైన ఆనందము చేకూర్చును

గీత శ్రీకృష్ణుని గృహము శ్రీకృష్ణుని స్వరూపము గీతయే గీతలను ఆశ్రయించుకొని శ్రీకృష్ణుడుండును గీతయే శ్రీకృష్ణుడు గీత యెచట ఉండునో శ్రీకృష్ణు డటనుండును గీతవున్న గృహములో సకల పుణ్యతీర్థములు సమస్త దేవతలు ఉందురు నిశ్చయము రాము దొక

గీతను వ్రాసెను దానికి రామగీత అని పేరు శివుడు వ్రాసిన గీతకు శివ గీత అని నామము కలదు అట్లే వశిష్ఠుడు వ్రాసిన గీతకు వశిష్ఠ గీత అనియు విశ్వామిత్రుడు రచించిన గీతకు విశ్వామిత్ర గీత అనియు దత్తాత్రేయుడు నుడివిన గీతకు దత్తాత్రేయ గీత అనియు పేరుంచినారు. అటులనే ఎన్నియున్నను కాని శ్రీకృష్ణప్రోక్తమైన గీతకే "భగవద్గీత" అను పేరుంచిరి దీని మహాత్మ్య మూహింపుడు అంతరార్థము గ్రహింపుడు గీత అనినను సుగీత అనినను భగవద్గీత అనినను శ్రీకృష్ణ గీతకే చెల్లును గీతనంతను పఠించుట పరమశ్రేయోదాయకము సాధ్యము కానిచో సగభాగముకాని మూడవవంతుగాని ఆరవవంతుగాని ఒక అధ్యాయముగాని లేదా అందులో సగముగాని ఒక శ్లోకముగాని దానిలో భాగముగాని కనీసము శ్లోకపాదమును చింతన చేసినను పుణ్యమబ్బునని తెలిపిచ్చినారు గ్రంథములలో శ్రేష్ఠమైన గ్రంథము గీత మానవుల మానస గ్రంథుల విచ్ఛేదమొనర్చు గ్రంథము గీత వేదవిభూతి వెల్గుచున్న ఉద్గ్రంథము గీత వేద వేద్యుడైన దైవము తాను స్వయముగా వచించిన గ్రంథము గీత గీతతో తులతూగగల గ్రంథము లేదు ముందురాదు గీతా మాత పరమ పవిత్రము గీతాశాస్త్రము వేదముల సారమే మానవ క్లేశములను తొలగించు ధర్మ సూక్ష్మము గీతాసారము జ్ఞానోపదేశము చేయు గీతామాతకు పూజ్యభావముతో నమస్కరింపుము

మాత ప్రత్యక్ష దైవము పదినెలలు మోసి వాత్సల్యముతో పెంచి పోషించుకొని ప్రేమతో సాకి రక్షించి పెద్దచేసిన పరమసాధ్వీమతల్లి కన్నతల్లి పరమపూజనీయురాలు కదా. అమ్మే తన కడుపున బుట్టిన బిడ్డలకే పాలొసంగి.

వారినే పెంచి పోషించును కావి గోమాత వివనములలో పర్వతములలో సంచరించి సకల మూలికలను మేసి ఆ మూలికలసారమును క్షీరరూపమున తన్నాశ్రయించినవారికి అందరకు అందించి శ్రేయమొనగూర్చును కావున మాతకన్న గోమాత గొప్పదికదా అంతకన్నను దేశమాత ఎంత దొడ్డదో మాడుడు వేద వేదాంత విద్యలు అవతరించిన పుణ్యభూమి వీరవీరా గ్రణుల కన్న వీరమాత కాళిదాసాదికవులను గన్న సాధుచరిత కోరిన వెల్లను దయచేయు కల్పవల్లి కదా దేశమాత మాతకన్నను గోమాత కన్నను దేశమాతకన్నను గీతామాత చాలగొప్పది ఆమె విశ్వమునకె మాత ప్రతి మానవుడు సాధించవలసిన పురుషార్థములు నాలుగు ధర్మ అర్థ కామ మోక్షములు ఈ చతుర్విధ పురుషార్థముల సాధనా కీలకమును బోధించు గీతామాత ఉత్తమోత్తమము కదా ఇట్టి ఉపనిషదర్థ ప్రతిపాదక మును బ్రహ్మవిద్యయును యోగశాస్త్రమును కృష్ణార్జున సంవాద రూప మున ప్రసిద్ధమగు భగవద్గీత దీని భావమును సంగ్రహముగా తెలిపితిమి గ్రహింపుడు



# భగవద్గీతావతరణము



భారతయుద్ధము జరుగనున్నది కౌరవ పాండవ బలములు రెండును యుద్ధమొనరింప ధర్మక్షేత్రమైన కురుక్షేత్రమున ఇరుపైపుల ఎదురెదురుగా నిలచియున్నవి ప్రపంచములోని రాజులందరు ఉభయపక్షములు చేరినారు దుర్యోధనునివైపు పదకొండు అక్షౌహిణుల సైన్యము పాండవుల వైపు ఏడు అక్షౌహిణుల సైన్యము మొత్తము పదునెనిమిది అక్షౌహిణుల సైన్యము యుద్ధమునకు సిద్ధముగా మోహరించి నిలుచున్నది కౌరవుల సర్వసైన్యాధ్యక్షుడు భీష్ముడు పాండవుల సైన్యమున కాధిపత్యము దృష్టద్యుమ్నుడు వహించెను అర్జునుడు తన సారధియై రథమునడుపుచున్న శ్రీకృష్ణునితో రథమును ఉభయసైన్యములమధ్య నిలుపుమని కోరెను శ్రీకృష్ణుడు రథమును ఉభయసేనామధ్యమున క్షోణిలో నిలుపగా అర్జునుడు ఉభయ సైన్యములను పరిశీలించెను స్వజనము తాతలు తండ్రులు అన్నలు తమ్ములు కుమారులు మేనమామలు మామలు గురువులు బావమరుదులు మొదలగువారు కనుపించిరి వీరిని చంపి నేను సంపాదించునదేమి ఛీ యుద్ధమొనరింపను అను నిర్వేదము కలిగెను ఆ నిర్వేదము అజ్ఞానజన్యము అస్వర్గ్యము అకీర్తికరమని కృష్ణుడు భావించి తనకు భక్తుడు మిత్రుడు బావయైన అర్జునకు ధర్మోపదేశమొనరించి దివ్యప్రబోధముచేసి జ్ఞానజ్యోతిని వెలిగించి ఐహికసామ్రాజ్యమునకు పారమార్థికసామ్రాజ్యమునకు అర్జును అర్హునిచేసెను ఆ దివ్యప్రబోధామృతమే ఈ గీత

# కౌ ర వు లు



ధృతరాష్ట్రుడు పాండురాజు అన్నదమ్ములు ధృతరాష్ట్రుడు పుట్టు గ్రుడ్డి ఆ కారణమున అతనికి రాజ్యాధికారము లేకుండపోయినది పాండురాజునకు పట్టాభిషేకము చేసినారు పాండురాజు అన్నగారిమీది భక్తివిశ్వాసములచేత సింహాసనముమీద అన్నగారినే కూర్చుండబెట్టి తన బాహుబల శౌర్యపరాక్రమములచేత రాజ్యమును విస్తరింపజేసెను ధృతరాష్ట్రునకు నూరుమంది కుమారులు కలిగిరి వారె దుర్యోధన దుశ్శాసనాదులు వీరినే కౌరవు లందురు

# పాం డ వు లు



పాండురాజునకు ఇరువురు భార్యలు కుంతిమాద్రులు అతనికి కుంతివలన ముగ్గురు కుమారులు మాద్రివలన ఇద్దరు కుమారులు కలిగిరి వారి పేరులు ధర్మరాజు భీముడు అర్జునుడు నకులుడు సహదేవుడు. వీరు పాండురాజుకుమారు లగుటచే పాండవు లనబడిరి అయిదుగురగుట పంచపాండవులని పిలువబడిరి

# భారత యుద్ధము



దుర్యోధనుడును ధర్మరాజును జూదమాడిరి ఆ ద్యూతనియమము తెలియవ ఓడినవారు తమ రాజ్యమును ధనమును సర్వమును గెలిచిన వారికి ఇచ్చి కట్టుగుడ్డలతో అరణ్యమునకు పోవలయును పండ్రెండు సంవత్సరములు అరణ్య వాసమును ఒక సంవత్సరము అజ్ఞాత వాసమును మొత్తము పదమూడు సంవత్సరములు సక్రమముగా గడిపి వచ్చిన తరువాత ఎవరి రాజ్యము వారు తీసుకొనవలెను ధర్మరాజు జూదములో ఓడిపోయినారు పండ్రెండు సంవత్సరములు అరణ్యవాసము సంవత్సరము అజ్ఞాతవాసమును చేసివచ్చి మా రాజ్యము మాకిమ్మని కౌరవుల నడిగినారు వాడిసూది మొనమోపు భూమినైన ఈయను అన్నాడు దుర్యోధనుడు అనేకమంది చెప్పినారు వినలేదు కృష్ణుడుకూడ రాయబారము నడిపినాడు. దుర్యోధనుడు చెవినిపెట్టలేదు యుద్ధము తప్పలేదు పదునెనిమిది దినములు ఘోరయుద్ధము జరిగినది ఉభయపక్షముల సైన్యములలోను చాల జననష్టమైనది శ్రీకృష్ణుని సాయమున పాండవులు విజయము గాంచిరి యుద్ధారంభమునందు జరిగిన కృష్ణార్జున సంవాదమే ఈ గీత

# గీతావక్త



గీతావక్త శ్రీకృష్ణపరబ్రహ్మమూర్తి ఆయన సర్వజ్ఞుడు సర్వ శక్తివంతుడు సాక్షాత్తు పరబ్రహ్మ పూర్ణావతారము లీలామానుష విగ్రహుడు కౌరవ పాండవులకు బంధువు అందుచే ఆయనను దుర్యోధనుడు అర్జునుడు ఇద్దరు యుద్ధమునకు పూర్వము సహాయము కోరినారు శ్రీకృష్ణుడు తన సైన్యమంత నొక భాగమనియు తానొకడు ఒక భాగమనియు తన సైన్యము యుద్ధము చేయుననియు తాను యుద్ధము చెయననియు ఆయుధము పట్టననియు చెప్పి ఎవరికి కావలసిన భాగము వారు కోరుకొమ్మనగా అర్జునుడు శ్రీకృష్ణుని కోరెను కృష్ణుని సైన్యము దుర్యోధనుని వరించెను కృష్ణుడు పార్థసారధియై రథమును నడిపెను అర్జునుడు యుద్ధారంభమున ఖేదము చెంది విషాదయోగములో మునిగి గాండీవమును అస్త్రములను జారవిడిచి ధర్మమును మరచి చేతులు జోడించినపుడు కృష్ణుడు అర్జునునకు ధర్మోపదేశము జ్ఞానోపదేశము చేసెను

# వ్యాసమహర్షి - గీతారచయిత



శ్రీకృష్ణపరమాత్మ ముఖకమలమునుండి ప్రవహించిన అమృత ప్రవాహము గీత. ఈ గీతాస్రవంతి నిరతిశయానందదాయకము. ఇది వ్యాస రచితమైన పంచమవేదమగు మహాభారతములో భీష్మ పర్వమున హారములో నాయకమణివలె సంపుటింపబడినది. వ్యాసమహర్షి మహానుభావుడు, భగవంతుడు, నాలుగుమోములులేని బ్రహ్మ, రెండుహస్తములు మాత్రమె కలిగిన విష్ణుమూర్తి, ఫాలనేత్రము లేని శివుడు, త్రిమూర్తుల కతీతుడు, అచ్యుతాంశ సంభూతుడు, వేదవిభాగమొనరించి బ్రహ్మసూత్రములు రచించిన సంయమీశ్వరుడు, భగవద్ప్రోక్తమైన గీతను రచించి గ్రంథస్థముచేసిన ఋషీశ్వరుడు, వ్యాసభగవానుడు భారతమునేకాక బ్రహ్మసూత్రములను అష్టాదశమహాపురాణములను భాగవతమును నిర్మించిన జ్ఞానసముద్రుడు.

# సంజయుడు



సంజయుడనగా ఇంద్రియములను చిత్తమును జయించినవాడని అర్థము ఈ మహాత్ముడే గీతను ధృతరాష్ట్రునకు వినిపించినాడు సంజయుని తండ్రి గవల్గణుడను సూతుడు ఈయన మంచి విద్యావేత్త ఆయన కుమారుడైన సంజయుడు శాంతుడు శిష్టుడు జ్ఞానవిజ్ఞానసంపన్నుడు సదాచారుడు నిర్భయుడు సత్యవాది జితేంద్రియుడు ధర్మాత్ముడు కృష్ణభక్తుడు అర్జునకు మిత్రుడు వ్యాసభగవానుడు భారత యుద్ధము ప్రారంభమగుటకు పూర్వము సంజయునకు దివ్యదృష్టి నిచ్చి సర్వము ధృతరాష్ట్రునకు వినిపించుటకు నియోగించెను

# అర్జునుడు



అర్జునుడు పాండురాజునకు కుంతివలన కలిగిన మూడవ పుత్రుడు అస్త్రవిద్యయందారితేరినవాడు త్రిశూలపాణియైన శివునితో పోరాడి శివుని మెప్పించి పాశుపతాస్త్రమందినయోధుడు అపజయమెరుగని శూరుడు కృష్ణ సహోదరి సుభద్ర భర్త అసహాయశూరుడైన అభిమన్యుని తండ్రి భారత యుద్ధమున ప్రముఖపాత్ర వహించి కర్ణాదివీరుల సంహరించి విజయలక్ష్మిని చేపట్టిన విజయుడు సార్థకనాముడు శ్రీకృష్ణుని సారథిగా పడయజాలిన పుణ్యుడు కృష్ణునినమ్మిన భక్తుడు అర్జునునకు దశనామములు కలవు అర్జునుడు ఫల్గుణుడు పార్థుడు కిరీటి శ్వేతవాహనుడు బీభత్సుడు విజయుడు జిష్ణుడు సవ్యసాచి ధనంజయుడు

# 1 అధ్యాయము అర్జున విషాద యోగము

~~~

అర్జునుడు - అచ్యుతా ! ఈ యుద్ధములో నేనెవరి నెదుర్కొనవలయునో యుద్ధసన్నద్ధులై నిలిచియున్నవారిని చూచుటకు రెండు సేనల మధ్యను నా రథమును నిలుపుము

కృష్ణుడు - అర్జునా ఉభయసేనల మధ్య మక్షోణిలో రథమును నిలిపితిని చూడుము

అర్జునుడు - యుద్ధముచేయ నిలచిన ఈ బంధువులను చూడగనే నా అవయవములు శిథిలమై పట్టుతప్పి పోవుచున్నవి నోరు ఎండిపోవుచున్నది శరీరము వణకుచున్నది గాండీవము చేజారిపడిపోవుచున్నది అమంగళకరమైన అపశకునములు కనిపించుచున్నవి ఈ స్వజనులందరను చంపి ఏమి చేయవలయునో తోచుటలేదు నేను యుద్ధము చేయలేను బంధువులను చంపలేను పూజ్యులైన గురువర్యులను ఎదిరింపనోపను నాకు రాజ్యసుఖము వద్దు విజయము వలదు భోగములపై ఆశలేదు భిక్షమెత్తి జీవించుటకైనను సమ్మతింతును కాని పాపమున కొడిగట్టజాలను

అని రథముపై కూలబడి దుఃఖించుచుండెను
~~~

# 2 అధ్యాయము సాంఖ్యయోగము



కృష్ణుడు - అర్జునా దుఃఖించకుము భయపడకుము హృదయదౌర్బల్యము విడుము లెమ్ము యుద్ధమొనర్పుము

అర్జునుడు - మహానుభావులైన గురువులను చంపజాలను నెత్తురుకూడు భుజించనొల్లను కృపణత్వముచే నా స్వభావమంతయు మారిపోయినది ఏది మేలో నిశ్చయించుకున్నాను నీ శిష్యుడను శరణుజొచ్చినాను దేవలోకాధిపత్యము సిద్ధించినను నా యింద్రియములను శోషింపజేయు దుఃఖమును పోగొట్టు వస్తువు నాకు కనుపించుటలేదు

కృష్ణుడు చిరునవ్వు నవ్వుచూ పార్థా! అర్థములేని మాటలను అనార్యునివలె పలుకుచున్నావు ఏమి ఈ వృధా ప్రలాపములు చంపుట ఏమి ఈ పార్థివులెవరు గురువులెవరు నీవెవరు ఇంచుక యోచింపుము నేనెనాడుపుట్టితినో ఆనాడే వీరందరు ప్రతులైరి నీవు నిమిత్తమాత్రమే నీవు నేను కనుపించుచున్న వారెల్లరు భూజనులందరు జీవులే ఆత్మరూపులే వారందరును నిత్యులే వారిని చంపుట ఎట్లు రానుచుంటివి ఆత్మను అస్త్ర శస్త్రములు ధ్వంసము చేయలేవు ఈ స్థూలదేహమందు బాల్యము యౌవనము ముదిమి కలుగుచున్నట్లే ఆత్మకు వివిధ దేహములు కలుగుచుండును పండితుడు దేహనాశనమునకు విచారింపడు ఆత్మ నిత్యము చంపునది చంపబడునది కాదు మనుష్యుడు చినిగిన వస్త్రములను

విడిచి క్రొత్త వస్త్రములను ధరించునట్లు ఆత్మ జీర్ణములైన శరీర ములను విడిచి క్రొత్తశరీరములను పొందుచుండును ఆత్మ ప్రపంచ మంతయు నిండియున్నది నాశములేనిది ఆత్మ ఆత్మకు నాశమును కలుగజేయువారు లేరు యుద్ధము చేయుము నెమ్ము ఆత్మను అగ్ని కాల్చజాలదు ఉదకము తడుపజాలదు గాలి శోషింపజేయలేదు ఆత్మ చక్షురాదీంద్రియములకు అగపడదు ఏ వికారములు ఆత్మకు లేవు యుద్ధముచేయుటకు దుఃఖింపకుము అర్జునా పుట్టి చచ్చి మరల పుట్టు దేహమునే ఆత్మగా భావించినను దుఃఖింపనవసరము లేదు ఏలనన పుట్టినవన్నియు నశించును నశించినవన్నియు మరల పుట్టును అగుచో నీవు దుఃఖింపదగునా ఎపీలికాది బ్రహ్మపర్యంతములు ఉండెడి దేహములందు ఉండు ఆత్మ యెప్పుడును చంపతగినదికాదు భీష్మాదుల కొరకేకాదు సర్వభూతములను నీవు దుఃఖింపతగదు నీవు నీ ధర్మమును గుర్తెరిగి చంపుము క్షత్రియునకు యుద్ధమే ధర్మము యుద్ధములో చనిపోయిన నీవస్వర్గము లభించును జయించిన రాజ్యసుఖమనుభవింతువు సుఖదుఃఖములను లాభనష్ట ములను జయాపజయములను సమానముగా భావించి యుద్ధమునకు సిద్ధపడుము అప్పుడు పాపమురాదు దేహాభిమానము వీడుము వైరాగ్యమును పొందుము

అర్జునుడు — కృష్ణా ! నీవు చెప్పిన సమాధియందునను బ్రహ్మమునను నిశ్చల బుద్ధిగలవాని స్వరూపమెట్టిది వాడెట్లు పలుకును ఎట్లు కూర్చుండును ఇంకెట్లు నడచును.

కృష్ణుడు – దుఃఖము కలిగినపుడు దిగులు చెందనివాడును సుఖము కలిగినపుడు సంతోషములేనివాడును రాగము భయము క్రోధము లేని మననశీలుడు స్థిత ప్రజ్ఞుడు ఎవడు ఏ విధమైన కోరికలు లేనివాడై శుభాశుభములు కలిగినపుడు సంతోష ద్వేషముల పొందకయుండునో వాని బుద్ధి స్థిరము తాబేలు తన అవయవములను లోనికి ఉపసంహరించుకొనునట్లు ఇంద్రియ గోచరములగు వస్తువులనుండి ఇంద్రియములను మరలించి స్వాధీనము చేసుకొని ఆత్మజ్ఞానము కలగి యెవడుండునో వాడు స్థితప్రజ్ఞుడు కోరికలన్నిటిని విడిచి శరీర జీవనమాత్రమైనను స్పృహలేనివాడై మమత్వము వీడి అహంకార వర్జితుడై సంచరించు జ్ఞాని మోక్షమును పొందును అర్జునా ఇదియే విశిష్టమైనది ఈ బ్రహ్మస్థితి కలవాడు మోహమునకు లొంగడు మోక్షమును పొందును కర్మ భక్తి జ్ఞాన యోగములన్నింటిని వివరముగా నెరిగింతును శ్రద్ధగా వినుము నీసంశయము లెల్లను తీర్తును ప్రశ్నింపుము సంశయింపకుము

# ౩ అధ్యాయము కర్మయోగము

అర్జునుడు - కృష్ణా జ్ఞానము కర్మముకన్న జ్ఞానమే గొప్పదగునేని నన్ను ఘోరమగు కర్మను ఎందుకు ప్రేరేపించుచున్నావు కర్మయోగమననేమో తెలిపితివా నా ధర్మమేమో వివరింతువా

కృష్ణుడు - అర్జునా ఎవడు ఆత్మయందు ఆసక్తికలవాడై ఆత్మచేతనే తృప్తినొందుచున్నాడో ఆత్మయందే సంతోషమును పొందుచున్నాడో వానికి కర్మములవసరములేదు అట్టి వానికి పిపీలికాది బ్రహ్మపర్యంతము ఒకానొక ప్రయోజనము సాధింపవలసినదిలేదు నీవు ఫలాపేక్ష లేనివాడవై చేయవలసిన నిత్యకర్మలను ఈశ్వరప్రీతికి చేయుము నీ స్వధర్మము శ్రేష్ఠమని స్మరింపుము పరధర్మము భయావహమని గ్రహింపుము శాస్త్రానుసారమైన కర్మలను లాభమపేక్షింపక మమకారములేనివాడవై దుఃఖమును మాని యుద్ధమొనరింపుము

# 4వ అధ్యాయము జ్ఞానయోగము



కృష్ణుడు – అవ్యయమైన జ్ఞానమును సృష్ట్యాదిని నేను సూర్యునకు ఉపదేశించితిని పురాతనమైన ఆ యోగమునిపుడు నీకు చెప్పెదను వినుము

అర్జునుడు – సూర్యుని జన్మము ముందు ఎపుడో కలిగినది నీ జన్మము ఆ వెనుకగదా నీవు సూర్యున కుపదేశించుట ఎట్లు పొసగును

కృష్ణుడు – అర్జునా! నీకును నాకును చాల జన్మలు గతించినవి ఆ జన్మల నన్నింటిని నేనెరుగుదును నీవెరుగవు నేను పర్వేశ్వరుడనయ్యును నా మాయచే పుట్టుచుందును అర్జునా ఎప్పుడెప్పుడు ధర్మమునకు ముప్పుకలుగునో ఎప్పుడెప్పుడు అధర్మము వృద్ధినందునో అప్పుడు ధర్మ సంరక్షణార్థము నేను అవతరింతును సన్మార్గులను రక్షించుట కును దుర్మార్గులను నిర్జించుటకును ధర్మము స్థాపించుటకును నేను ఉద్భవించుచుందును నేనెత్తిన జన్మలన్నింటిని నేనెరుగుదును నీవెరుగవు జ్ఞానము చాల పవిత్రమైనది కట్టెలను అగ్నిదహించు నట్లు జ్ఞానాగ్ని కర్మలన్నిటిని భస్మము చేయును జ్ఞానికే ఆత్మ కాంతి లభించును

# 5వ అధ్యాయము-కర్మసన్యాసయోగము



అర్జునుడు – కృష్ణా ! కర్మలను విడువుమంటివి మరల కర్మలను చేయ మంటివి ఈ రెంటిలో ఏది మంచిదో నిశ్చయముగా తెల్పుము

కృష్ణుడు – అర్జునా ఆలకింపుము భయము కోపము కామాది వికారము లను విడిచి వాంఛలను వదలి ఇంద్రియములను మనస్సును బుద్ధిని స్వాధీనమందుంచుకొని మోక్షప్రాప్తిని వాంఛించి విమలమైన జ్ఞానమును కలిగి భగవద్ విశ్వాసముతోనుండుటే కర్మ సన్యాస యోగమని గ్రహింపుము

# 6వ అధ్యాయము-ఆత్మసంయమయోగము



అర్జునుడు – మనస్సు చాల చంచలముకదా కృష్ణా ! దానిని నిరోధించుట యెట్లు ? ఆత్మసంయమయోగమననేమి ?

కృష్ణుడు – అర్జునా ! నిజమే మనస్సు చాల చంచలమైనది అయినను అభ్యా సముచేతను వైరాగ్యముచేతను నిరోధింపనగును చిత్తమును ఇంద్రియమును స్వేచ్ఛగా చలింపగనీక నిరోధించి సమదృష్టి కలవాడై ఇత్తడిని బంగారమును శత్రువులను మిత్రులను పూజ్యు లను అపూజ్యులను ఒకే విధముగా భేదములేని దృష్టితో చూడగల ఉత్తమ జ్ఞానమే ఆత్మసంయమయోగము

# 7వ అధ్యాయము-విజ్ఞానయోగము

అర్జునుడు - కృష్ణా ! భగవంతుడవైన నిన్ను సేవించు వారందరు విజ్ఞానులేనా ?

కృష్ణుడు - అర్జునా ! నన్ను నాలుగు రకములవారు సేవింతురు ఆర్తులు అనగా తస్కర వ్యాఘ్ర రోగాదులచే పీడితులు జిజ్ఞాసువులు అనగా భగవంతుని తెలియగోరువారు అర్థార్థులు ధనము కోరువారు జ్ఞానులు జ్ఞానము కలిగినవారు వారిలో జ్ఞానులు శ్రేష్ఠులు వేలాది మనుష్యులలో ఒకానొకడు మోక్ష సిద్ధికి యత్నించును అట్లు యత్నించిన వారిలో వేయి కొకడెవడో ఆత్మను గుర్తించును ఆ గుర్తించిన వారిలో యెవనికో ఒకనొక కి ఆత్మవిద్య ఫలవంత మగును ఆ ఆత్మజ్ఞాన విజ్ఞానమందిన యోగీంద్రుడు సిద్ధపురుషుడు వేత్త అనఘుడు విజ్ఞుడు ప్రశంసార్హుడు

# 8వ అధ్యాయము అక్షర పరబ్రహ్మయోగము



అర్జునుడు - కృష్ణా అక్షర పరబ్రహ్మయోగ మననేమి? నరులు మరణ కాలమందేమి చేయవలెను

కృష్ణుడు - అర్జునా! నరుడు అంత్యకాలమున ఏ భావమును స్మరించుచు దేహమును విడుచునో ఉత్తర జన్మమందు ఆ భావనాను చింతనచే శాంతమైన చిత్తము గలవాడై యుండును ఆ భావమునే పొందును కావున అన్ని కాలములయందును నన్ను స్మరించుచుండుము తప్పక నన్నే పొందుదువు

# 9వ అధ్యాయము-రాజవిద్యారాజగుహ్యయోగము



అర్జునుడు - కృష్ణా! నీవెవరు నీకేమి సమర్పింపవలెను రాజ విద్యా రాజ గుహ్య యోగమును వివరింతువా ?

కృష్ణుడు - అర్జునా! ఈ జగత్తు సృష్టికి నేనేకారకుడను తండ్రిని తల్లిని నేనే కర్మఫలముల నిచ్చువాడను నేనే ఓంకారము నేనే జగత్తును భరించువాడను సంహారకుడను నేనే సమస్తము నేనే నాయందే మనస్సునిల్పి నాకు భక్తుడవై నన్ను పూజింపుము నీ మనస్సును నాయందు లగ్నముచేసిన పరమానంద స్వరూపుడనగు నన్ను పొందుదువు భక్తితో సమర్పించు పత్రమును పుష్పమును ఫలమును తోయమును నేను ప్రీతితో గ్రహింతును

# 10వ అధ్యాయము-విభూతియోగము



అర్జునుడు - కృష్ణా ! నీవు పరమ పవిత్రుడవనియు పరబ్రహ్మమవనియు శాశ్వతుడవనియు ప్రకాశరూపుడవనియు సర్వవ్యాపకుడవనియు చెప్పుదురు నీవును చెప్పితివి నీ దివ్యవిభూతి నెరింగింపుమా

కృష్ణుడు - అర్జునా నా విభూతుల కంతములేదు సర్వభూతముల సృష్టించి భరించి నిర్జించువాడనునేనే సర్వవిభూతికి మూలమునేనే ఈ సర్వము లేని కాలమందును సర్వము నాశనమైన తరువాతను నేనుందును సర్వభూతములకు బీజమునేను చరాచర ప్రపంచ ములో నేను లేనిదిలేదు దివ్యములగు నా విభూతులకు అంతము లేదు ఈ జగత్తంతయునేనే నాకంటె అన్యముమరేమియులేదని గ్రహింపుము

# 11వ అధ్యాయము-విశ్వరూపసందర్శనయోగము



అర్జునుడు - కృష్ణా నాయందనుగ్రహించి పరమగోప్యము పరమార్థనిష్టము వైన ఆత్మ తత్వమును నీవెరిగింపగా తెలుసుకొంటిని నీ శక్తిని గ్రహించితిని నీవిశ్వరూపమును మాకగోరుచు టిని ప్రభువరేణ్యా! దయతో అనుగ్రహించి చూపుమా

కృష్ణుడు - ఈ చరాచర ప్రపంచమంతయు నా దేహమందె ఉన్నది నేనే సకలము నా నిజస్వరూపమును నీ తోలుకండ్లు మాసజాలవు దివ్య దృష్టి నొసగివాడను చూడుము

అర్జునుడు నమస్కారము దేవదేవా! జగములన్నియు సర్వజీవులు నీ శరీరములోనే చూచుచున్నాను నీ విశ్వరూ మునకు ఆదిమధ్యాంత ములు కనపడుటలేదు మహాత్మా అనంతా దేవేశా! జగన్నివాసా నీవు సర్వస్వరూపుడవు దేవా ఎన్నడును చూడని నీరూపమును చూచి తరించితిని జగన్నివాసా ప్రసన్నుడవు కమ్ము పాహిమాం పాహిమాం

కృష్ణుడు - అర్జునా! భయమును మానుము సంతోషముతో మరల యెప్పటి రూపమునే చూడుము

# 12వ అధ్యాయము-భక్తియోగము



అర్జునుడు - కృష్ణా నమస్కారము నీయందెప్పుడును విడ్డగలగ భక్తితో నిన్ను ధ్యానించుచుండెడివారా లేక అవ్యక్తము అక్షరమైన పర బ్రహ్మమును ధ్యానించువారా యోగిసత్తములు

కృష్ణుడు - అర్జునా ! నాయందు దృఢనిశ్చయము విశ్వాసముకల్గి దూషణ భూషణములను సమానముగా గ్రహించి నిత్యసంతోషముతో సుఖ దుఃఖములను స్వీకరించి మనస్సులో హర్షము ద్వేషములేక మనో నిగ్రహము కలిగి శత్రు మిత్రులయందు మానావమానములయందు శీతము ఉష్ణము దుఃఖము సుఖము కలిగినప్పుడును సమబుద్ధి గలిగి సంగవర్జితుడై దొరికినదానితో సంతుష్టుడై నా యందు భక్తి గలిగి యుండువాడు శ్రేష్టుడని తెలుసుకొనుము ఇదియే భక్తియోగము.

## 13వ అధ్యాయము క్షేత్రక్షేత్రజ్ఞవిభాగయోగము

**అర్జునుడు** - కృష్ణా! ప్రకృతియననేమి పురుషుడనగా నెవరు క్షేత్ర మనగానేది క్షేత్రజ్ఞుడనగ నెవరు జ్ఞానమననేమి జ్ఞేయమననేమియో తెలియగోరెదను కేశవా! దయయుంచి తెలుపుమా

**కృష్ణుడు** - అర్జునా ఈ అనువు (శరీరము) క్షేత్రము జీవియే క్షేత్రజ్ఞుడు ఏది క్షేత్రమో ఎవరు క్షేత్రజ్ఞుడో తెలియజేయునదే జ్ఞానము జగము మిథ్య బ్రహ్మ సత్యమని తెలుసుకొనుటయే జ్ఞేయము

## 14వ అధ్యాయము-గుణత్రయవిభాగయోగము

**అర్జునుడు** - కృష్ణా! త్రిగుణములేవి వానినతిక్రమించిన జీవియెట్లుండును

**కృష్ణుడు** - అర్జునా! సత్త్వము రాజసము తామసము అను గుణములు మూడును ప్రకృతివలన పుట్టినవగుచు దేహమందు తాదాత్మ్యముగ నున్న ఆత్మను విబంధించుచున్నవి ఈ మూడు గుణములకు అతీతుడై సుఖదుఃఖములయందు సమానచిత్తుడై ప్రియము అప్రియమునందు ధైర్యముంగల్గి నన్ను ఏకాంతమనుభక్తితో సేవించుచుండువాడు బ్రహ్మత్వమునకర్హుడు

## 15వ అధ్యాయము పురుషోత్తమప్రాప్తియోగము



అర్జునుడు - కృష్ణా! పురుషోత్తముడన నెవరు పురుషోత్తమ ప్రాప్తి యోగమననేమి

కృష్ణుడు - అర్జునా క్షరుడు అక్షరుడు అని లోకములో ఇద్దరు పురుషులు గలరు ఎంలికాదీ బ్రహ్మపర్యంతముండు సర్వభూతములు క్షరులు కూటస్థుడు అక్షరుడు ఈయిర్వురి ంకెను వేరుగా క్షరుని అతిక్రమించి అక్షరునిమించి పురుషోత్తముడనుగా వేదములయందు ప్ర ద్ధిగాం... ...న్న సెవించి పర జ్ఞానవగుము

## 16వ అధ్యాయము దైవాసురసంపద్విభాగయోగము



అర్జునుడు - కృష్ణా భూతములన్నియు ఒకటేనా ఇందేమైన వ్యత్యాసమున్నదా ?

కృష్ణుడు - అర్జునా భూతములందు రెండు వర్గములు కలవు దైవము అసురము వేదప్రమాణము నంగీకరింపక ధర్మాధర్మరూపవ్యవస్థ లేక స్త్రీ పురుష సంయోగము వలన జగము పుట్టుచున్నదని తలంచువారు అసురులు నీతి శాంతి శీలము త్యాగముకల్గి వేదవిధిననుసరించువారు దైవికులు అని గ్రహింపుము

## 17వ అధ్యాయము శ్రద్ధాత్రయవిభాగయోగము



అర్జునుడు – కృష్ణా! శాస్త్రవిధి నతిక్రమించి శ్రద్ధతో యజ్ఞమునుచేసిన ఆస్థితి యెట్టిది సత్త్వాశ్రయమా రాజసమా తమోగుణాశ్రయమా తెలుపుమా

కృష్ణుడు – అర్జునా కర్మమునెరిగి గుణత్రయాంభక్తమైన శ్రద్ధతో మనోవాక్కాయకర్మలతో ఓం తత్ సత్ అను విధానమున శాస్త్రవిధిని చేసిన యజ్ఞము మాత్రమె సత్త్వ ప్రధానము

## 18వ అధ్యాయము–మోక్షసన్యాస యోగము



అర్జునుడు – కృష్ణా సన్యాసము యొక్కయు త్యాగము యొక్కయు తత్త్వమును తెలియగోరుచున్నాను

కృష్ణుడు – కామ్యకర్మలను విడుచుట సన్యాసమనియు సర్వకర్మముల ఫలమును విడుచుట త్యాగమనియు తెలియుము. అర్జునా సర్వభూతములను తన శక్తిచే యంత్రముమీదనున్న వానిని త్రిప్పునట్లు త్రిప్పుచూ ఈశ్వరుడు భూతముల హృదయమందు ఉండును ఆ ఈశ్వరుడను నేనే నాయందే చిత్తముంచుము నన్నే సేవింపుము నన్నే పూజింపుము నాకే నమస్కరింపుము సర్వ ధర్మములను

విడిచిపెట్టి నన్ను శరణుపొందుము నేను నిన్ను అన్ని పాపముల
నుండి విడిపింతును దుఃఖింపకుము ధర్మమాచరింపుము లెమ్ము
అర్జునా అజ్ఞానమువలన పుట్టిన నీ మోహము నశించినదా

అర్జునుడు — కృష్ణా ! నా మోహమంతరించినది నా సందేహములన్నియు
తీరినవి వేదవేద్యుని నిన్ను కనులార చూడగలిగితిని నీ ఆజ్ఞను
సంపూర్ణ విధేయతతో నిర్వర్తింతును సెలవిమ్ము

కృష్ణుడు — అర్జునా ఈ జగన్నాటకమున నీవొక పాత్రధారివి నీపాత్రను
ధర్మానుసారముగా శ్లాఘాపాత్రముగా నిర్వహింపుము

అర్జునుడు — కృష్ణా అట్లే నా శక్తికొలది సమర్థతతో నిర్వహింతును
నీ ఆజ్ఞానువర్తినై మెలగెదను

కృష్ణుడు — శుభమస్తు ధనుర్ధారివై యుద్ధమొనరింపుము

అర్జునుడు — ధన్యుడను (శంఖమునొత్తి యూదును)

కృష్ణుడు — అర్జునా ! విజయోస్తు — దిగ్విజయోస్తు



# ఫలశ్రుతి

ప్రతి దినము ఈ గ్రంథము పఠించినవారి సంసార బంధములు సడలిపోవును నిత్యమైన నిరతిశయమైన సత్యమైన మోక్ష సామ్రాజ్యలక్ష్మి లభించును

# ముగింపు మాటలు

పాఠకులారా భగవద్గీతామహామను భగవద్గీతా సారము మీరు సంగ్రహముగా తెలుసుకొనినారు సంపూర్ణముగ తెలియగోరువారు మూల గ్రంథమును ఆమూలచూడముగ సవ్యాఖ్యానముగా గురుముఖమున శ్రవణము చేయవలయును

లోకములన్నియు జనులందరును సుఖముగా శాంతిసౌఖ్యములతో వర్తిల్లుదురు గాక !

**ఓం తత్ సత్**

సమాప్తము